# విజ్ఞాపన.

**భక్తాగ్రేసరులారా!**

శ్లో. రామం ఏవ పరబ్రహ్మ రామం ఏవ పరంతపః।
రామం ఏవ పరంతత్వ శ్రీరామో బ్రహ్మతారకః।

అని రామ రహస్యోపనిషద్వాక్య ప్రకారంబున రామతారక మనియు, బ్రహ్మతారక మనియు, జెప్పబడుచున్న శ్రీరామ మంత్రధ్యానంబుకన్న మనుష్యుల పాపంబులు బోగొట్టి ముముక్షత్వ మియ్యజాలిన మంత్రరాజంబు వేరొండు లేదని సర్వ గ్రంథంబులు జాటుటయే గాక మదీయానుభవంబు దెలియజేయును. నెట్లన మచ్ఛరీర రుగ్మతయు భార్యా వియోగాది యనేక కష్టంబు లొక్క సమయంబున నన్ను జాటుముట్ట మనోవికలుండనై యెట్టియుం దోచక (రామ మంత్ర పఠేన్నిత్యం సర్వకష్ట వినాశయః) అను నార్యోక్తి ననుసరించి శ్రీరామమూర్తిని హృదయ కంజంబు నందిడి ధ్యానించుచుండ కొన్ని దినంబులకే మనోశాంతియు కష్ట విముక్తియుం గల్గె, నంత నొక దినంబున

సీ. అఖిలరోగముల ♦ దివ్యౌషధ రాజంబు
మొనయు విపద్వనం ♦ బునకు పరశు
సర్వ కల్మషజాల ♦ నుర్వీధరాశని
కవియున జ్ఞానాంధ ♦ కార హేళి
జననమరణ దుఃఖ ♦ సాగర తరణంబు
చిత్తచంచలభేక ♦ జిహ్వాగంబు
మహిత సమ్మోహతా ♦ మర తోదులకుదంతి
గురు యీషణత్రయ ♦ కుంజరహరి

తే. అరయ తాపత్రయాభ్రము ♦ హానిలంబు
దార సుతహిత భ్రాంతికి ♦ దివ్య వహ్ని
శత్రు మూషకతతికి మా ♦ ర్జాల సమము
నవ్యసుఖదము శ్రీరాము ♦ నామ జపము.

అని రామమంత్ర ప్రభావంబు వర్ణించి తృప్తిఁజెందక భగవధ్ధ్యాన పూరకంబగు యీ శతకంబు నా శక్తికొలంది వ్రాసితి. యిందలి దోషంబుల పాటింపక భక్తియే ముఖ్యంబని యెరింగి, సర్వదా శ్రీరామధ్యాన తత్పరులై యిహపర సాధనంబుల గ్రహించి మెలంగుదురని వేడుచున్నాడ.

ఇట్లు
భగవద్భక్త విధేయుడు,
పణితపు నాగభూషణం.
ఒంగోలుతాలూకా, మడనూరు.

# మడనూరు శ్రీరామ శతకము

శా. శ్రీనిర్వాణ పదంబు జెందుటకునై ♦ చిత్తంబునన్ నిల్పి నే
ధ్యానింతున్ వరతల్ప శేషుదితిసం ♦ తానోగ్రవిద్వేషు గా
దీనాథస్తుత సత్యభాషు సుతనీ ♦ రేజేషు సద్భూషు సీ
తానాక్షి హృదయప్రతోషు నిజభ ♦ క్తశ్రేణి సత్పోషునిన్.

సీ. శ్రీరమణీమణీ ♦ చిత్తసారసభృంగ
కారుణ్య వార్నిధి ♦ ఖగతురంగ
పురుషోత్తమా శౌరి ♦ పోషితమాతంగ
భవవందితా భక్త ♦ పాపభంగ
నతజిష్ణుముఖదేవ ♦ తతిసాధు హృత్సంగ
దేవసంయమిలోల ♦ ధృతరథాంగ
కమనీయ కంకణా ♦ గరుడిష్ట సర్వాంగ
భవ్యతల్ప భుజంగ ♦ పాండురంగ

గీ. శతకమొక్కటి నీకు నుం ♦ కితమొసంగి
జెప్పబూనితి కరుణతో ♦ చిత్తగింపు
భూరిగయసీమ శ్రీ మడ ♦ నూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ.

సీ. సర్వ కార్యములెల్ల ♦ సఫలతగావించు
విఘ్ననాయకు మదిన్ ♦ వినుతిజేతు
యెల్ల విద్యలకును ♦ తల్లియై పోషించు
భారతీదేవికి ♦ ప్రణతి సేతు
మృదుమానుసపు పల్కు ♦ ...డిన వివిధగ్రంథ
ములు రచించెడు ♦ సత్కవుల దలంతు
మహిమాన్వితశ్రేయధుర్యు ♦ మతిమాని లింగార్యు
ప్రథము కారణాసరున్ ♦ ప్రస్తుతింతు.

గీ. గురు విభుండైన ...ంకేన ♦ సుగుణశీలు
సుబ్బయార్యుల సతతంబు ♦ స్తుతియింతు నర్తు
భూరిదయసీమ ♦ శ్రీ మదనూరుధామ
గౌరనుత నామ శ్రీరామ ♦ శిలపిరామ.

సీ. భుజగేంద్ర శయనకిం ♦ పురుషకిన్నరసిద్ధ
విద్యాధర సమూహ ♦ వినుతచరణ
గాధేయ యజ్ఞ వి ♦ ఘ్నకులైన మకదైత్య
భంజితాశ్రిత జన ♦ ...వితరణ
యాంచిత శ్రీర గీ ♦ త్రెంచు భక్తశ్రేణి
విపులపాపధ్వాంత ♦ నేడికిరణ
దెసలమిక్కిలి కాంతు ♦ లెసగించజాలిన
సురుచిరంబైన కౌ ♦ స్తుభాభరణ

గీ. సకలనిగమార్థ వేదుడా ♦ సజ్జనాళి
నిన్నుధ్యానింపమని దెల్పు ♦ సిక్కముగను ॥భూ॥ 3

సీ. పరమేశ నీనామ ♦ పఠన జేయుటకన్న
లలిత జిహ్వకుగల్గు ♦ లాభమేది
వదలక నీపాద ♦ వారిజార్చనకన్న
పాణిద్వయము బొందు ♦ ఫలమదేది
పావనమౌ నీదు చా ♦ రిత్ర శ్రవణముకన్న
కర్ణయుగళము బొందు ♦ ఘనమదేది
యసమాన నీమూర్తి ♦ నాలోకనముకన్న
భాసురకనుదోయి ♦ భాగ్యమేది.

గీ. యింపుతోనీకు వందనం బిడుటకన్న
శిరముగాంచెడి సత్ఫల ♦ సిద్ధియేది భూ 4

సీ. మృగరాజు గనినంత ♦ మృగసమూహంబెల్ల
కడు భీతిచే బరువ్వు ♦ లిడును కరణి
ఝంఝూనిలము నీవ ♦ జలధర పటలంబు
చిదుత ఖండంబులై ♦ చెదరు భాతి
కర్మసాక్షోదయ ♦ కాలమే తెంచగా
ఘనాంధకారము బాయు ♦ నట్టివిధము
నాగాంతకాలోక ♦ నముచేత కాకోద
రాళిగుట్టల జేరి ♦ నడుగు కరణి

తే. చెలగి నీసేవ నిరతంబు ♦ జేయువాని
పాపజాలంబు దూరంబు ♦ బారిపోవు
భూరిదయనీవు ♦ శ్రీమదనూరిధామ
గారినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 5

సీ. అతిశయంబా స్వేచ్ఛ ♦ నటవిభూములదంతి
సంతోషమును గూడి ♦ సంచరించు
కరిరాజు దాహంబు ♦ కై పోయి త్రిపత
మడుగులో గ్రాహంత ♦ మకరి బట్ట
తప్పించుకొనగ సా ♦ ధ్యముగాక కడు వెస్సి
మొఱగెత్తి పరమేశ ♦ యీశ శ్రీశ
పద్మాలయాధిపా ♦ పన్నవారణ భక్త
వత్సలామరరాజ ♦ వందితాంఘ్రి

తే. యనుచు మనిసేయు విని వేగ ♦ జని మకరిని
ద్రుంచి కరిరేఁడు గాచిన ♦ ధీరచరిత భూప 6

సీ. ధరణి కన్యాకుబ్జ ♦ పురమందు నొక విప్ర
జాతి జన్మించిన ♦ యాతఁడు నొక
దాసినే తనదగు ♦ దారగా భావించి
పదుగురు బిడ్డల౯ ♦ బడసి మిగుల
మోహసాగరములో ♦ మునిఁగి తస్కరజూద
ములఁ బెక్కు పాప ♦ ములు ఘటించి
కడు వృద్ధుఁడై మృత్యు ♦ కాలమాసన్నత
కాలకింకరులను ♦ గాంచి సుతుని

తే. నాదు ప్రియపుత్ర నారాయ ♦ ణాయటంచు
నుడువఁ బ్రాణంబు విడ మోక్ష ♦ మిడితివౌర
భూరిదయచేను ♦ శ్రీమదనూరిధామ
గానుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 7

సీ. కమలవాసిని దేవి ♦ కాక్షించియే దేవు
వరధర్మ పత్నియై ♦ వరలుచుండ
శతముఖుండాది ని ♦ర్జరచయంబే దాత
దయచేత నమృతంబు ♦ ద్రావబడిరి
సనకాది మౌనీంద్ర ♦ సంఘంబులే స్వామి
భజియించి కైవల్య ♦ పదవిగనిరి
మకరిచేజిక్కి సా ♦ మజనాథుడే యీశు
వినుతించి దానిచే ♦ విడువబడియె.

తే. నట్టినిన్నదనమ్మి నే ♦ ననవరతము
భక్తిధ్యానింతు బ్రోవుమా ♦ పరమపురుషా ॥భూ॥ 8

సీ. నిరతంబు నీపాద ♦ నీరజంబులపూజ
చే తృప్తిజెందు కు ♦ చేలుగాంచి
ఘన పేదతనమునన్ ♦ తనయుల పోషింప
నేరక నీ బాల్య ♦ నేస్తుడైన
నందనందను వేడి ♦ నన్ సిరులిడునంచు
దార ప్రార్థింపగా ♦ ద్వారకకును
పరమేశ యనుచు నీ ♦ భజన సల్పుచు రాగ
నత్యంత సంతసం ♦ బంది తమకు

తే. ప్రీతి దెచ్చిన పిడికెడు ♦ పృథుకతండు
లముల భుజియించి సకలభా ♦ గ్యములొసగిన
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరనుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 9

సీ. సతతంబు నీనామ ♦ స్మరణ జేసెడువాని
భాగ్య మెంతనియందు ♦ పరమపురుష
ముదమునఁ నీ పాద ♦ పూజ జేసెడువాని
భోగ మెంతనియందు ♦ పురుషసింహ
విమలమౌ నీకథల్ ♦ విడువక వినువాని
పుణ్య మెంతనియందు ♦ భోగిశయన
స్థిరమతి నిన్ను ద ♦ ర్శించుచుండెడువాని
యైశ్వర్య మేమందు ♦ నతులచరిత
తే. యమల మనమున నీకు జో ♦ హారుజేయు
వానిఫల మేమనందు శ్రీ ♦ వరమురారి ॥భూ॥ 10

సీ. గజరాజవరదనీ ♦ భజనసల్పెడునన్ను
పాలింపకుండుట ♦ భావ్యమగునె
శ్రీశనీపాదాబ్జ ♦ సేవజేసెడునన్ను
కరుణించకుండుట ♦ ఘనతయగునె
మురవైరి నీనామ ♦ మును స్మరించెడు నన్ను
దయజూడకుండుట ♦ ధర్మమగునె
పురుషోత్తమా నిన్ను ♦ పూజజేసెడునన్ను
మన్నింపకుండుట ♦ మంచిదగునె.
తే. వజ్రినుతపదనన్నేలు ♦ వరకునిన్ను
విడుతుననుమాట మదిలోన ♦ విడువుమింక
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 11

సీ. నిజభార్యచూడగా ♦ నించుకడ లేనిదై
సంచరించుచునుండు ♦ సర్వజగము
తనయునాలోకింప ♦ తనుప్రతేజోయుక్త
మోహింపజేయును ♦ మూడుజగముల
వాహనంబునుగాంచ ♦ సాహసంబున వ్యోమ
పథమున దిరుగునప్పు ♦ డబ్బురపడును
శయ్యనువీక్షింప ♦ సహస్రాక్షుడైయున్నాడు
యేకాలకేమగు ♦ నెంచనాడో.

తే. యనువిచారణ చేయుచు సీత శోకమయ్యె
నిజభక్తుల నెట్లుబ్రోతు ♦ వింది రేశ ॥భూ॥ 12

సీ. కరిరాజు మొఱవిని ♦ కాచిరక్షించినా
వనుమాట యదార్థ ♦ మయ్యెనేని
దైత్య డింభకుని బా ♦ ధల నొందనియక
జక్క జేసినమాట ♦ నిక్కమేని
పిడికెడటుకులనియ్య ♦ కడుభాగ్యముల నా కు
చేలు కిచ్చినమాట ♦ సిద్ధమేని
సభలోన ద్రుపదాత్మ ♦ జకు నక్షయంపు వ
స్త్రము లొసంగినమాట ♦ సత్యమేని

తే. దీనరక్షణ బిరుదుండే ♦ నేని నేడు
సరగదర్శన మిప్పుడే ♦ సాక్షినాకు
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 13

సీ. ఇంద్రియంబుల సఖ్య ♦ మికనొల్లననునట్లు
వడవడవడ తల ♦ వడకునపుడు
తత యౌవనంబు యీ ♦ గతిదైన దనునట్లు
నొడలెల్ల ముడతలు ♦ బడినయపుడు
వాంఛ లోకొక్కటి ♦ వదలిన వనునట్లు
వాడిదై బరగు పం ♦ డ్లూడినపుడు
సారహీనపు ప్రపం ♦ చము జూడననునట్లు
చక్షుద్వయము చూపు ♦ సమసినపుడు

తే. నిన్ను ధ్యానింప ♦ జిత్తంబు నిలువబోదు
గాన యిదె వేడుచుంటి నో ♦ కంజనేత్ర ॥భూ॥ 14

సీ. ముఖమునకును తేజ ♦ మునకును సరిరాక
చంద్రభాస్కరులు లో ♦ చనములు లైరి
బలమున కెనరాక ♦ బలవైరి గెల్చిః
వైనతేయుండిద ♦ వాహమయ్యె
చక్కదనమున కోడి ♦ శంబరాసురవైరి
దారిగోచక ముద్దు ♦ తనయుడయ్యె
నీ సుచరిత్రముల్ ♦ నెరినుతింపగ లేక
పాముల యేకి ♦ మీడు పానుపయ్యె

తే. నని బొగడుదురు నిన్ను గాం ♦ చిన మహాత్ము
లట్టి దర్శన మొసగునా ♦ కమలచరిత
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 15

సీ. వల్మీక సుతుడు కే ♦ వలజ్ఞానమూర్తియై
బరగిన దేద్దాని ♦ పఠనజేసి
ఘనపాపియై యంత్య ♦ మున నజామిళుండు
పుత్రు నేమని జీరి ♦ పొందె సుగతి
నల్ల కుత్తుకవాని ♦ నాతీశిరోమణి
కఠ్రాంత మేదిజ ♦ పార్వ్వమయ్యె
కౌరవుల్ మాన భం ♦ గము జేయనెంచ ద్రౌ
పదిదేనివి నుతించి ♦ బడసె వలువ
తే. లట్టి నీదివ్య నామమే ♦ ననవరతము
భక్తి ధ్యానింతు బ్రోవుమా ♦ పరమపురుష ॥భూ॥16
ముక్తపదగ్రస్తు సీసం
సీ. సాధులోకశరణ్య ♦ సర్వ జగదాధార
ధారాధర శరీర ♦ దైత్య విజిత
జిత పుష్పసాయకా ♦ శ్రిత భవ్య పదపద్మ
పద్మాల యాధిపా ♦ పన్నివార
వారణా వనకేశ ♦ వా వాహఖగరాజ
రాజ మార్తండ నే ♦ త్రదయ జలధి
జలధి బంధన పాప ♦ హ్మాధ రచయశంబ
శంబరాసుర వైరి ♦ జనకనంద
తే. నందనానిజభక్త మా ♦ నస నివాస
వాసవ ప్రముఖనుతయశో ♦ భాస భూరి
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 17

సీ. తండ్రి బాధలనుండి ♦ దప్పె ప్రహ్లాదుండు
నిరతంబు నీనామ ♦ స్మరణ చేత
నుగ్రమకరిచే ♦ నుండి విడువగబడెన్
కరిరాజు నీనామ ♦ స్మరణ చేత
కడులేమిచే గ్రపడెడు ♦ కుచేలుండు
సిరిబొందె నీనామ ♦ స్మరణ చేత
యక్షయవసనంబు ♦ బందె పాండవరాణి
సభలోన నీనామ ♦ స్మరణ చేత
తే. కష్టముల శత్రులను లేమి ♦ గడకు ద్రోచి
పరువు గాపాడు నీనామ ♦ స్మరణ మహిమ ॥భూ॥ 18

సీ. పతి శాపవశమున ♦ బండయైన యహల్య
యోయి నీ పదస్పర్శ ♦ నుంచి యవ్వె
యసురుల చేజిక్కి ♦ నట్టి సుమ్మృతము దేవ
తలు నీదు కరుణచే ♦ ద్రావబడిరి
గిరి వైరిశిలవృష్టి ♦ గురిశింప గూడవుల్
బ్రతికిరి దేవ ♦ ప్రాపు జేరి
ధార్తరాష్ట్రులను యు ♦ ద్ధములో జయించుట
పాండవు లేస్వామి ♦ బలముగల్గి
తే. యట్టి నీనామ మంత్రంబు ♦ ననుదినంబు
పఠన జేసిన మోక్షంబు ♦ బడయు టరుదె
భూరిదయసీమ ♦ శ్రీమడసూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ కులవిరామ. 19

సీ. నిరతంబు నీనామ ♦ స్మరణ గోరని యట్టి
భావంబు భావమే ♦ పరమపురుష
ముదముతో నీపాద ♦ పూజ సేయనియట్టి
చేతులు చేతులే ♦ శ్రీనివాస
కెరలి నీనామ సం ♦ కీర్తనల్ బాడని
వక్త్రంబు వక్త్రమే ♦ వారిజాక్ష
చెలగి నీరూపు ద ♦ ర్శించ కాంక్షించని
చక్షులు చక్షులే ♦ జలజనాభ

తే. వరుసశిల తరుశాఖలు ♦ పరగ మున్న
ద్రవ్వ గుంటయు కుడ్యరం ♦ ధ్రములుగాక ॥భూ॥ 20

సీ. మనమున నీనామ ♦ మంత్రంబుజపియించు
వానిసమాన మె ♦ వ్వరునుగారు
శ్రోత్రముల్ దనియ నీ ♦ శుభకథల్ వినునట్టి
వానిసమాన మె ♦ వ్వరునుగారు
తలవంచినీకు ని ♦ శ్చలభక్తితో మ్రొక్కు
వానిసమాన మె ♦ వ్వరునుగారు
కరములారంగ నీ ♦ చరణార్చనమొనర్చు
వానిసమాన మె ♦ వ్వరునుగారు

తే. వదలకను కనులనీదు రూ ♦ పమునుగాంచి
వరలువాని సమాన మె ♦ వ్వరునుగారు
భూరిదయనీను ♦ శ్రీమడనూరిధామ
గారినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 21

సీ. అంజనీకొమరుండు ♦ యబ్ధిలంఘించుట
నళినలోచన నిన్ను ♦ నమ్మిగాదె
భీష్మాదికురువీర ♦ బృందంబుగెల్చుట
నరుఁడు నిన్నెదలోన ♦ నమ్మిగాదె
లలవిభీషణుఁడు యా ♦ లంకాధిపతియౌట
నతపురందర నిన్ను ♦ నమ్మిగాదె
కడుపేదయౌ కుచే ♦ లుఁడు భాగ్యయుతుఁడౌట
నాగరిగమన ని ♦ న్నమ్మిగాదె
గాన నీనిజభక్త ♦ లోకంబునకును
బడయనేరని కోరికల్ ♦ పుడమిఁగలవె. ॥భూ॥ 22

సీ. సిరిమించు సాకేత ♦ పురియందు కౌసల్య
దశరథులకు ముద్దు ♦ తనయుఁడవయి
గాధేయయజ్ఞవి ♦ ఘ్నకులౌ సుబాహు మా
రీచుల గర్వంబు ♦ నీచపరచి
మునినాథు వెనువెంట ♦ జని మిథిలాపురిఁ
జంద్రశేఖరు శరా ♦ సనము విఱచి
యసమాన సౌందర్య ♦ మమరి బెంపొందు సీ
తామానినిఁ యుప ♦ యామమాడి
తే. యఖిల పార్థివ జనదర్ప ♦ మడచినట్టి
పరశురాము జయించిన ♦ చిరయశుఁడవు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 23

సీ. రక్తి నిన్ బట్టాభి ♦ షిక్తు జేయగ నెంచు
దశరథావని పాలు ♦ తలపెరింగి
కైక వరములగోరి ♦ కానకంపగ జేయ
సీత లక్ష్మణుడు సం ♦ ప్రీతి గొలువ
జనిక్ష్మాజ నెత్తుక ♦ జను విరాధుని ద్రుంచి
చిత్ర కూటంబును ♦ జేర భరతు
డరిగి తండ్రి సురేంద్ర ♦ పురి జేరెనని దెల్పి
రాజ్యంబు పాలింప ♦ రమ్మటన్న

తే. జనకు నాజ్ఞను దాటగా ♦ జనదటంచు
పాదుకల నిచ్చి పంపిన ♦ ప్రభుడ వీవు ।భూ॥ 24

సీ. పంచవటికేగి శూ ♦ ర్పణఖ నాసికకర్ణ
ములు లక్ష్మణుడు గోయ ♦ భూరిరోషు
లైకరదూషణా ♦ ద్యమరారులరుదేర
ఘోరాజినందఱి ♦ గూల్చివైచి
మాయామృగంబైన ♦ మారీచు దెగటార్చి
సీతగానక మహా ♦ చింతనొంది
ప్రియసతి తెఱగు జె ♦ ప్పిన పక్షి ప్రాణముల్
విడువాగ్నిసంస్కార ♦ విధులొనర్చి

తే. బహువిచిత్రస్వరూపు క ♦ బంధుద్రుంచి
శబరి పూజల గైకొన్న ♦ సార్వభౌమ
భూరిదయాసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 25

సీ. పంపాతటముఁజేరి ♦ భానుపుత్రునితోడ
సఖ్యంబొనర్చి వా ♦ లివధించి
కిష్కింధ కధిపు సు ♦ గ్రీవుని జేసి యం
గదుని శ్రీ యువరాజు ♦ గానొనర్చి
ధరణిజా న్వేషణా ♦ ర్థము సూర్యసుతుఁడు మైం
దుని సుషేణశత వ ♦ లిని వరుసగ
పూర్వచర మోత్తరం ♦ బులకు ప్లవగ సమూహ
మును నిచ్చిబంపి ద ♦ క్షిణము రోయ

తే. గాడ్పుకొమరుని నియమింప ♦ గా నెరింగి
పరమ సంప్రీతి దీపించి ♦ పంపినావు ॥భూ॥ 26

సీ. క్షితిజాతరోయ మా ♦ రుతికి ముద్రికనిచ్చి
బంపిన నిపాక ♦ భక్తుఁడోట
జలనిధి లంఘించి ♦ సరగ లంకనుజొచ్చి
వైదేహి నివసించు ♦ వనము జేరి
ముద్రికఁ బ్రియ ♦ మున్నయు కిచ్చితా
నొసగిన రత్నంబు ♦ వెసగ్రహించి
వనము బాడొనరించి ♦ ఘన రాక్షసుల ద్రుంచి
నెరివాల వహ్నినా ♦ పురి దహించి

తే. వచ్చి తెచ్చిన రత్నంబు ♦ నిచ్చి సీత
తెరగు దెల్పగ సృక్కితి ♦ దీనుభంగి
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 27

సీ. వేల్వడెబ్బది రెండు ♦ వెల్లువలగ గపిసైన్య
యుత్సుకవై సంభ్రమంబు ♦ దొద్దు తేరి
శరణంబు వచ్చిన ♦ పరివార్ధితో బుట్టు
కత్యంత ప్రీతిచే ♦ నభయ మొసగి
జలనిధి బంధించి ♦ నరగ లంకను చుట్టు
ముట్టడించియు బంధు పుత్ర మిత్ర
పరివార యుతముగా ♦ పంక్తి కంధరు మన్మి
లలివిభీషణున కా ♦ లంక నొసగి

తే. ధరణిజను గొని సాకేత ♦ పురము జేరి
పట్టభద్రుడ వైనట్టి ♦ పరమ పురుష ॥భూ॥ 28

సీ. లోకేశువంచించి ♦ లోకోపకారమా
శ్రుతుల మ్రుచ్చిలి వేగ ♦ సోమకుండు
సింధువందున బ్రవే ♦ శింపమహామీన
మూర్తివై ఘనరోష ♦ మును జెలంగ
వనధిశోధించి దై ♦ త్యునితోడకయ్యంబు
జేసి వానిమడియ ♦ జేసిసురలు
సురవిభుండు యతుల ♦ గరుడోరగులు మెచ్చ
వేదములను దెచ్చి ♦ వేధకిచ్చి

తే. నట్టినీసాహసాధిక్య ♦ మభినుతింప
తలలు వేయిగల శేషుని ♦ తరమె శౌరి
భూరిదయాసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 29

సీ. దేవాళియున్పూర్వ ♦ దేవసమూహంబు
సమ్మృతపానాసక్తు ♦ లైగడంగి
కవ్వంబుగా తరి ♦ గట్టును బెకలించి
దెచ్చి క్షీరాబ్ధిని ♦ ద్రచ్చునపుడు
కడువిస్తరంబైన ♦ కమఠరూపము దాల్చి
కొండవీపునవిల్పు ♦ కొని ముదమున
యుధదినుద్భవమైన ♦ సుధనుజానవ సమా
జము జెందనీక ని ♦ ర్జరులకొసగి

తే. నట్టినిన్నాదనిల్పి నే ♦ ననుదినంబు
భజనజేసెదగావుమా ♦ పరమపురుషా ॥భూ॥

సీ. సతతంబు నీనామ ♦ సంకీర్తనల్ బాడి
యానంద మొందు ప్ర ♦ హ్లాదు గాంచి
యత్యుగ్రమైన కో ♦ పానల జ్వాలలు
దిశలందు వ్యాపింప ♦ దిట్టి కొట్టి
మదగజంబుల పాద ♦ మర్దన గావించి
కాకోదరాళిచే ♦ గరువ జేసి
గిరులపై నుంచియు ♦ క్రిందికి ద్రోయించి
పెక్కు బాధలచేత ♦ స్రుక్కజేయు

తే. రుక్మకశ్యపు నరసింహ ♦ రూపమునను
జంపి బాలునిగాచిన ♦ సార్వభౌమ
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ.

సీ. బలిదైత్య నాథుని ♦ బారి కోర్వగ లేక
శక్రాది సురలెల్ల ♦ సన్నుతింప
నోడకుడని తెల్పి ♦ నొయ్యననదితి క
శ్యపులకు హ్రస్వుండ ♦ వై జనించి
తెల్సి తెలియనివాని ♦ తెఱగున మెల్లనం
జని దానవేంద్రుని ♦ వినుతి జేసి
పాదత్రయము వేడి ♦ పద భ్రష్టుగావించి
త్రిదశుల బాధలం ♦ దీర్చి బ్రోచి

తే. నట్టి నీపాద పద్మంబు ♦ లనుదినంబు
సేవజేసెద గావుమా ♦ శ్రీనివాస ॥భూ॥ 32

సీ. అతిభయంకర వృత్తి ♦ నఖిలప్రాణులను బా
ధించుచు గర్వంబు ♦ మించియున్న
నరకాసురు వధించి ♦ చెరసాలలోనున్న
పదియాఱు వేవుర ♦ మదవతులను
ద్వారకాపురి జేర్చి ♦ వారిని వేర్వేర
రమణీయమైన గే ♦ హముల నిల్పి
రూఢి నందరి కన్ని ♦ రూపంబులం దోచి
గాఢాను రాగంబు ♦ గలుగ జేసి

తే. లీలనొకరికి మొసబాటు ♦ లేక మెలగి
నట్టి నీమాయ దెలియ సా ♦ ధ్యంబె విధికి
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 33

సీ. పరుల కార్యము విఘ్న ♦ పరచ కుండిన చాలు
చేరి ధర్మపు పెండ్లి ♦ జేసినట్లు
బీదల కిడుట ద ♦ ప్పింపకుండిన జాలు
సౌవర్ణదానంబు ♦ సల్పినట్లు
పరవిత్తముల కాస ♦ పడకుండుటయె చాలు
విపులమౌ చెరువు ప్ర ♦ తిష్ఠించినట్లు
హింస జేయుట కిచ్చ ♦ యింపకుండిన జాలు
నవ్యాశ్వమేధంబు ♦ నర్పి నట్లు
తే. చెలగి నీ భక్తులను నింద ♦ జేయకున్న
చిత్తమున నిన్ను నిల్పి పూ ♦ జించినట్లు ॥భూ॥

సీ. తగమేలు మేల్ ♦ పదార్థములచే బోషింప
కలకాల మీమేను ♦ నిలువబోదు
బడరానికష్టముల్ ♦ బడి కూడబెట్టిన
విత్తమించుక యేని ♦ వెంటరాదు
భార్య పుత్ర మిత్ర ♦ బంధువర్గము మోహ
పాశమేకాని లాభంబులేదు
శాస్త్రపురాణముల్ ♦ జదివి జెప్పగ నేర్చి
తనివిజెందినను సా ♦ ర్థకములేదు
తే. గాన నిత్యసుఖానంద ♦ మైనపదవి
నొసగు నీ నామమంత్రమే ♦ వెసజపింతు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ.

సీ. అతిలోభి యాచించి ♦ వెతలు జెందుటకన్న
గూలికై యొకరింట ♦ గుదుర మేలు
తనమాట కెదురాడు ♦ తరుణి నేలుటకన్న
నటవిలో సంచరిం ♦ చుటయె మేలు
కుత్సితుండగువాని ♦ కొలువు సేయుటకన్న
మాధుకరంబుచే ♦ మనుట మేలు
విశ్వాసమతిలేని ♦ విందు కేగుటకన్న
దుస్తరంబైనట్టి ♦ వస్తు మేలు
తే. పరము దెల్పని గురువుల ♦ పంచ జేరి
చెడుట కన్నను నూతిలో ♦ బడుట మేలు ॥భూ॥ 36

సీ. లలితదానమె చేతు ♦ లకు భూషణముగాని
నానావిధా మణికంక ♦ ణములుగావు
శ్రీశుకథల్ వినుట ♦ చెవులసొమ్ములుగాని
కమనీయమా కుండ ♦ లములుగావు
యొరులకు మేల్సేత ♦ నోడలవాసనగాని
పరగసుగంధలే ♦ పనముగాదు
ఘనమైన సత్కీర్తి ♦ తనుసురూపముగాని
మనసిజసమ చక్క ♦ దనముగాదు
తే. యనుచు భావించి సజ్జను ♦ లవనియందు
నడచుచుందురు నిన్నాత్మ ♦ నమ్మియెపుడు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 37

సీ. సతతంబు తనతోడి ♦ జగడమాడెడుభార్య
వదలకపోషించు ♦ టదియురోత
దాతృత్వమెఱుగని ♦ ధనికునికడకేగి
సిరయాశయాచన ♦ సేయరోత
నేర్పుమీఱఁగ విద్య ♦ నేర్పనికుత్సితుఁ
డైనగురునకు శిష్యుఁ ♦ డౌటరోత
తనమర్మములనెల్ల ♦ దగనొండ్లకెరిగించు
చెనటిస్నేహంబును ♦ సేయరోత

తే. దీనమందారవిడక నీ ♦ దివ్యనామ
స్మరణజేయని మానవ ♦ జన్మరోత ॥భూ॥

సీ. భర్తకు సతి యఱఁ ♦ బ్రాణమంచని బల్కు
పల్కు సత్యముగాఁగ ♦ భార్యగాని
కోరు వస్తుచయంబు ♦ గొని తెచ్చియిచ్చి ప్రే
మను బెంచినట్టికొ ♦ మరులుగాని
ఘనమైన మర్యాద ♦ లను మితిలేని సం
తోషంబు జెందు బం ♦ ధువులు కాని
యొఁడొరులకు ప్రాణ ♦ మొక్కటే యనునట్టి
హితవుచే వర్తించు ♦ హితులుగాని

తే. యంత్యమున వెంట నొకరు రా ♦ రనుచు దెలిసి
నిన్ను పూజించు పురుషుఁడే ♦ నిపుణు డరయ
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గారిసుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ.

సీ. ద్వాదశ కళలచే ♦ దనరుచు బగటి యం
దున దోచినట్టి చం ♦ దురునిరీతి
లలిత యౌవనపు కా ♦ లమున నపుంసపు
భర్త గల్గిన యట్టి ♦ పడతిభాతి
ముదుసలితనమునన్ ♦ బోషింప నేరని
తనయులు గలయట్టి ♦ తండ్రి కరణి
పంచాస్త్రినైన రూ ♦ పముచేత నోడించు
నెఱి విద్యలేని సుం ♦ దరుని గతిని

తే. దాన ధర్మము సేయని ♦ మానవునకు
ధనము గల్గియు కడు నిర ♦ ర్థకముగాదె ॥ భూ ॥ 40

సీ. పరదార గోరి రా ♦ వణు డతిబలుడయ్యు
పుత్రపౌత్రుల తోడ ♦ బోర ద్రెళ్ళె
దుర్యోధనుండు జ్ఞా ♦ తులకు పాలీయక
సానుజుడై గూలె ♦ సమరమందు
తగదన్న వినక జూ ♦ దంబాడి నడవులన్
బడరాని కష్టముల్ ♦ బడియె నలుడు
హరిని స్మరించ వ ♦ ద్దని సుతు బాధించి
కనక కశ్యపుండు ♦ కలన నీల్గె

తే. గానవటువంటి యక్రమ ♦ గతుల జొరక
నిన్నుధ్యానించు వారలె ♦ నిపుణు లరయ
భూరిదయసీమ ♦ శ్రీమడసూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 4

సీ. పరదార ధనములపై ♦ భ్రాంతి పడకుంట
పరగ నసత్యంబు ♦ బలుకకుంట
పరుల కార్యముల దో ♦ డ్పడి పూర్తి జేయుట
జీవహింస నెపుడు ♦ జేయకుంట
పెద్దల దర్శించి ♦ ప్రియముతో మ్రొక్కుట
కుజనులతో మైత్రి ♦ గూడకుంట
నతిథుల నిరుపేద ♦ తతులను దయజూచి
తనశక్తి కొలదిగా ♦ ధర్మ మిడుట
తే. చిత్తమున నిన్ను నిల్పి పూ ♦ జించుటయును
గలిగి యుందురు సజ్జనుల్ ♦ కలుష హరణ ॥భూ॥ 4

సీ. తల్లిదండ్రుల యందు ♦ దయలేక యిడుములఁ
బెట్టుచు పోషింప ♦ నట్టివారు
ధనకాంక్ష చేతను ♦ తగ లంచముల దీసి
తప్పుసాక్ష్యంబుల ♦ జెప్పు వారు
పరవిత్త మపహరిం ♦ పగ భ్రాంతి పడువారు
పరకార్యముల విఘ్న ♦ పరచు వారు
హరిదాసులను గాంచి ♦ పరిహాసించెడు వారు
జీవహింసను జేసి ♦ చెలగు వారు
తే. నిన్ను ధ్యానింపగా నేర ♦ కున్న వారు
కాలకింకరు గదల చే ♦ కష్టపడరె.
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ.

సీ. శమన కింకరులు పా ♦ శముల చేతను బూని
భీకరాకృతి గాను ♦ పించు వేళ
తతపైత్యశ్లేష్మ వా ♦ త జ్వరంబుల జిక్కి
బహువిధంబుల బాధ ♦ పడెడు వేళ
భార్యపుత్ర మిత్ర ♦ బంధువుల్ గుమిగూడి
బాయని రోదనల్ ♦ సేయు వేళ
చిత్త వికారంబు ♦ జెంది క్రమంబుగా
తను ప్రపంచ జ్ఞప్తి ♦ దప్పు వేళ
తే. నిన్ను మనమున నిల్పి ధ్యా ♦ నింపగలనె
వదలకను ముందె భజియింప ♦ వలయుగాని ॥భూ॥ 44

సీ. అతియాశకన్న వే ♦ రైన దుర్గుణ మేది
పరనింద కన్నను ♦ పాపమేది
యొరులను నొవ్వజే ♦ యుటకన్న హింసేది
నింద కృత్యముకన్న ♦ నీచమేది
న వ్యయశస్సుక ♦ న్నను భూషణం బేది
సుగుణంబు కన్నను ♦ సుబలతేది
యక్షీణమైన స ♦ సత్యము కన్న తపమేది
విద్యకన్నను నొండు ♦ విత్తమేది
తే. భాను శశినేత్ర నీ పాద ♦ పద్మయుగము
నమ్మికొల్చుటకన్న యా ♦ నందమేది
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 45

సీ. క్రూరమానసుఁడైన ♦ కొడుకు కుద్భవించిన
          నప యశంబున నన్వ ♦ యంబు జెడును
సాంద్ర దుర్గుణుఁడైన ♦ సచివుండు గల్గిన
          ప్రభువు శీఘ్రము మెదద ♦ భ్రష్టుఁ డగును
అతి పర్వములు తపం ♦ బాచరించిన మౌని
          కించదా మన్మథ ♦ క్రీడ జెడును
మానకానిశముఁదు ♦ ర్మార్గుల మైత్రిచే
          సదమలంబైన శౌ ♦ చంబు జెడును

తే. పావనపు నీదు నామ జ ♦ ప భిదఃరమున
తరము గానట్టి కిల్బిష ♦ గిరులు జెడును ॥భూ॥ 46

సీ. గుణవతియైనట్టి ♦ కులసతియైనచో
          సేవలుసతతంబు ♦ జేయుచుండు
కడుజ్ఞానసంపత్తి ♦ గలపుత్రులైనచో
          పోషింపనేర్తురు ♦ బుధులుమెచ్చ
బహుప్రేమగలయట్టి ♦ బంధువులైనచో
          యంచితమతి విచా ♦ రించుచుంద్రు
చెడ్డచిత్తములేని ♦ స్నేహితులైనచో
          వ్యవహారమున సహా ♦ యంబొనర్తు

తే. రంతియేగాని నిర్మలం ♦ బైనపదవి
జెందజేయరుగాన నీ ♦ సేవజేతు.
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 47

సీ. తాతతండ్రార్జిత ♦ ధనమెల్ల చేబూని
జూదమాడుచుమదిగా ♦ ఖేదపడుట
యాలుబిడ్డలఃకూటి ♦ కల్లాడునటు జేసి
మద్యపానము జేసి ♦ మత్తుగొనుట
తగునాయటంచెదగా ♦ దలపోయకరువంగ
జీవసంఘముహింస ♦ జేయుటయ్యును
పరలోకసుఖహాని ♦ కరమంచనక నన్య
కాంతలపై ప్రేమ ♦ గవయుటయును
తే. సత్సహవాసమిన్నింటి ♦ సమయ జేసి
నీపదధ్యానరతు జేయు ♦ నిశ్చయముగ ॥భూ॥ 48

సీ. పెద్దల గనినంత ♦ ప్రియముతో మ్రొక్కుట
విడచి దూషణ జేయ ♦ గడగుటయును
నఖిల ప్రాణుల నుద ♦ యాదృష్టి జూచుట
మాని హింసింపగా ♦ బూనుటయును
బాగైన శౌచ సం ♦ ప త్తిచే నుండుట
దొరగి దుశ్చేష్టలగా ♦ దిరుగుటయును
యనవరతము సత్య ♦ మాడునట్టి వ్రతంబు
వీడి వృథా బొంకు ♦ లాడుటయును
తే. పరమ పూరుష నీ నిజ ♦ భక్తవరుల
తోడి స్నేహంబు నిన్నింటి ♦ ద్రోలగ ద్రోయు
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 49

సీ. ధనము హెచ్చు కొలంది ♦ తన చిత్తమందునఁ
 గలిగి యుండును తస్క ♦ రుల భయంబు
నరు బలాన్వితుఁడౌచు ♦ నొప్పుచుండిన సదా
 గలిగి యుండును శాత్ర ♦ వుల భయంబు
శాస్త్రంబు లనేకంబు ♦ జదివి చెప్పదొడంగ
 గలిగి యుండును పండి ♦ తుల భయంబు
తత భోగయుక్తుఁడై ♦ దనరుచుండిన మదిఁ
 గలిగియుండును రోగ ♦ ముల భయంబు
తే. యేభయము యెట్టి వేళల ♦ యెఱుఁగ నట్టి
 దరయ నొక్కటి లేదు నీ ♦ స్మరణ దక్క ॥భూ॥

సీ. శాంతమే నొడల ర ♦ క్షణజేయు కవచంబు
 గాన వేరొండింక ♦ గాన బడదు
క్రోధంబు కన్నను ♦ బాధించు శత్రువు
 ధరణి నెచ్చోట వె ♦ దకిన లేదు
ఖలునితో విడని సాం ♦ గత్యంబు కన్నను
 పగబూని యున్న ప ♦ న్నగము లేదు
తంద్రికి దుర్మార్గ ♦ తనయు డుండుట కన్న
 తీరని రోగంబు ♦ వేరె లేదు
తే. ఘనతరంబైన నీనామ ♦ వినుత సేయు
 వారి దూరుట కన్న పా ♦ పంబు లేదు
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 5

సీ. తప్పు సాక్ష్యంబులఁ ♦ జెప్పుటకై గాదు
నోరు నీకీర్తన ♦ నుడువుటకును
చెడుకార్యముల నెల్ల ♦ జేయుటకై గాదు
చేతులు నీపూజ ♦ సేయుటకును
పరవిత్తముల కాస ♦ పడి భ్రమింపగ గాదు
మనసు నీయందున ♦ మరుపుట కును
స్త్రీలజూచియు మోహ ♦ లోలుడౌటకు గాదు
కనులు నీరూపంబు ♦ గాంచుటకును

తే. గలిగియున్న పటంచని ♦ దెలిసి భక్తి
తోడచరి యించుచున్నట్టి ♦ వాడె నరుడు ॥భూ॥ 52

సీ. శంబరాసురవైరి ♦ డంబువిడంబించు
కడుమోహనాకృతి ♦ గల్గియున్న
గిరులపక్షంబులఁ ♦ నరికిననము చిశా
త్రపు సమభోగంబు ♦ దనరియున్న
దండిశూరుల నెల్ల ♦ దర్పంబడంచిన
యలభార్గవుని శౌర్య ♦ మమరియున్న
శైలజహృత్కుశే ♦ శయభానుసంకాశ
నైశ్వర్యయుక్తుఁడై ♦ యలరుచున్న

తే. తావకాంఘ్రులహృదయప ♦ ద్మముననిల్పి
భక్తినర్చించకుండిన ♦ ముక్తిసున్న
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ.
గారినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 53

సీ. పరికింపగా నిశా ♦ పతిలేనిరాత్రి నా
ధుడులేని సుందర ♦ వ ♦ ధూతిలకము
నారిలేని శరాస ♦ నముమృదుపల్కులు
బల్కుకీరములేని ♦ పంజరంబు
నాసలేనట్టి యా ♦ ననము భూనాయక
వర్యుండులేని వి ♦ శ్వంభరంబు
తొండంబులేనివే ♦ దండంబు ఘనసభక్
పండితుండుండ ని ♦ పగిదినీదు

తే. స్మరణలేకున్న మానవ ♦ జన్మ నిష్ఫ
లంబు వేడెదనను బ్రోవు ♦ మంబుజాక్ష ॥భూ॥ 54

సీ. పంద్రెండు వర్షముల్ ♦ ప్రాయంబునన్ ఘోర
రూపియౌ తాటక ♦ రూపుమాపి
ధరణినెవ్వరికి సా ♦ ధ్యముగాక విడచిన
ఖండేందుధరు కార్ము ♦ కమును విఱచి
యతిభయంకర సైన్య ♦ యుతులైన ఖరదూష
ణులనొక్క కాండంబ ♦ కలనజంపి
వడిదశాస్యుని జంక ♦ నిడుకొన్న నవ్వాలి
నొక్కబాణంబుచే ♦ స్రుక్కడంచి

తే. నట్టిశౌర్యాగ్రగణ్యుడ ♦ వైననీవు
భక్తిపాశంబునకు గట్టు ♦ బడుదువపుర
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 55

సీ. సర్వచరాచర ♦ సముదాయము సృజించు
నేర్పరి వాగ్దేవి ♦ నేతసుతుడు
తనులేక నొకకార్య ♦ మును జేయ సాధ్యంబు
గాని పద్మాలయా ♦ కాంతభార్య
ధరణి భారము నెల్ల ♦ తలలందునిడి మోయు
సుభగుడైనట్టి శే ♦ షుండుశయ్య
పవలు రేయినిదెల్పు ♦ పద్మాప్తుడు ముదబాం
ధవులారయంగ నే ♦ త్రద్వయంబు

తే. గనుక నీఘనమెవ్వరు ♦ వినుతిసేయ
నేర్తురిలలోన ననుబ్రోవ ♦ నీవెదిక్కు ‖భూ‖ 56

సీ. సకల ప్రాణుల సృష్టి ♦ సల్పు బ్రహ్మవునీవ
విడువక పోషించు ♦ విష్ణువీవ
సమయింప జేసెడి ♦ చంద్రధరుడ వీవ
సురపాలుడౌ పురం ♦ దరుడ వీవ
సర్వ భక్షకుడైన ♦ జాత వేదుడవీవ
సకల జదదాధార ♦ శ్వసను డీవ
దినము లోకులకెల్ల ♦ దెల్పు సూర్యుడవీవ
విపుల పైరులబెంచు ♦ విధుడవీవ

తే. యితనతని యిదియునది యని ♦ యెంచనేల
వివిధ తెరగుల దోచు యీ ♦ విశ్వమీవ
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 57

సీ. వరుణాది సకల దే ♦ వ వ్రాతములకెల్ల
నాయకుండగు శచీ ♦ నాధునట్లు
భూమి పుత్రార్కజ ♦ బుధ శుక్ర సురగురు
వాదిగ్రహాముల స ♦ ప్తాశ్వు నట్లు
శారిక శుకమాన ♦ సౌక. సశ్యేనాది
ద్విజతతులకు వైన ♦ తేయునట్లు
మలయ పూర్వగంధ ♦ మాదనరజితాది
క్ష్మాధరాళికి హిమ ♦ శైల మట్లు

తే. మంత్రములకెల్ల నీనామ ♦ మంత్రరాజ
మధికమని జెప్పటకు సంది ♦ యంబు గలదె ॥భూ 58

సీ. బాల్యంబునఁ జిన్న ♦ బాలుర బలువురఁ
గూడాడు చుండుట ♦ కొన్ని నాళ్లు
యౌవనంబున కన్ని ♦ యల సురత క్రీడ
గోరి ద్రిమ్మరు చుంట ♦ కొన్ని నాళ్లు
కౌమారమునను భే ♦ కము రీతి సంసార
కూపమందున జిక్కి ♦ కొన్ని నాళ్లు
వార్ధిక్యమునను లే ♦ వగ లేమి దండంబు
గొని సంచరించుట ♦ కొన్ని నాళ్లు

తే. గడుపు చుండెడు జనులలో ♦ గలరు కోటి
కొకరు నీ పద భక్తులై ♦ యొప్పు వారు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిభామ. 59

సీ. పాలమున్నీటిలో ♦ పల నుద్భవంబయ్యు
సురవైరి మర్దను ♦ మరది యయ్యు
యఖిల లోకానాథు ♦ డైనట్టి హిమభూమి
ధరజాధిపు శిరో ♦ వతంస మయ్యు
నోషధి స్తోమంబు ♦ పోషించు వాడయ్యు
పరికింపగా సుధా ♦ కిరణు డయ్యు
కుముద బాంధవుడు ♦ తాగుంము చుండడె సదా
తన కున్న క్షయరోగ ♦ తను గురించి

తే. గాన యెంతటి ఘనుడైన ♦ హీనుడైన
దైవ విధి ననుభవింపక ♦ తప్ప దిలను॥భూ॥

సీ. పటు రౌద్ర శాలురా ♦ పగతుల నెఱతలల్
గొట్టి మించిన యట్టి ♦ జెట్టియైన
చిరుత కాలువ రీతి ♦ చివ్వన నెగసి వే
జలనిధి లంఘించు ♦ సత్త్వుడైన
రాజసూయ మహాధ్వ ♦ రము జేయ సర్వది
గ్విజయంబు జేసిన ♦ వీరుడైన
లలితవఖండంబు ♦ లను నిజభుజశక్తి
పాలించిమను సార్వ ♦ భౌముడైన

తే. దానవాంతక నీకృప ♦ లేని నాడు
పక్షములు లేని విహగంబు ♦ పగిది దోచు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 61

సీ. పరదార పర ధనా ♦ పహరణ పరుడైన
దీనుల బాధించు ♦ హీనుడైన
యొరుల సంపద జూచి ♦ యోర్వని వాడైన
పశువుల వధియించు ♦ పాపియైన
తస్కర వృత్తిచే ♦ తనుమను వాడైన
గురువుల నిందించు ♦ కుమతి యైన
విమల మానసమునన్ ♦ విడువక సతతంబు
నీ నామము నుతింప ♦ నేర్చి నపుడు
తే. భయపడగ నేల మును జేయు ♦ పాపములకు
సామజము నెక్క కుక్కలే ♦ సరణి గరచు ॥భూ॥

సీ. గంభీరమై భయం ♦ కరమైన సాగరం
బింత లోతని నిర్ణ ♦ యింప వచ్చు
న గణితమౌ తార ♦ క గణంబు నెల్లను
కించదు విడక లె ♦ క్కింప వచ్చు
నతి సూక్ష్మమైన నీ ♦ హార బిందువులను
శేషమించుక లేక ♦ జెప్ప వచ్చు
కడు ప్రయాసనక నై ♦ క్షిత మింతగలదంచు
చెలగి వేగమె లెక్క ♦ జేయ వచ్చు
తే. గాని తావక మహిమ నా ♦ కమల గర్భు
డైన వర్ణింప నేర్చునే ♦ యబ్జనాభ ॥భూ॥
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరిసుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ.

సీ. కడు నిష్టబూని స ♦ క్రమముగా ఏకాద
శ వ్రతంబులు చాల ♦ జరుపుటయును
నఖిల పాప క్షయం ♦ బని లోకమందు వం
చిత తీర్థయాత్రలు ♦ చేయుటయును
వేద శాస్త్రంబులు ♦ వీఽవిగా వల్లించి
నిపుణతగా జెప్ప ♦ నేర్చుటయును
స్నాన సంధ్యాద్యను ♦ ష్ఠాన పరుండయి
మిగుల శీలత చేత ♦ మెలగుటయును

తే. పరమపూరుష నీయందు ♦ భక్తి నిలిపి
స్మరణ జేసిన దానికి ♦ సమమొతలప ॥భూ॥ 64

సీ. కమనీయమైన బం ♦ గారంబుపుటము వే
సినవన్నెసుంతైన ♦ చెడనిరీతి
నమృతోపమానమై ♦ యలరారు గోక్షీర
ములు కాగిచవి గోలు ♦ పోనిభాతి
శరధినుద్భవమైన ♦ శంఖంబు భస్మమై
ధవళవర్ణంబు వి ♦ డువనిమాడ్కి
నగము మాణిక్యంబు ♦ సానచే నరిగియు౯
తగదానికాంతి త ♦ రుగనిపోల్కి

తే. విధివశంబున సిరిదన్ను ♦ విడచిచనిన
ధార్మికగుణంబు విడువడు ♦ దాతభువిని ॥భూ॥
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గారినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 65

సీ. మిణుగురుబురువోచు ♦ మెరయుచుండదె మింట
　　గ్రహరాజు తావక ♦ కరుణలేమి
బాలురాటలనాడు ♦ బాతిగ్రమై యొప్పదే
　　కనకాద్రి తావక ♦ కరుణలేమి
తొండంబుగలయట్టి ♦ దోమపైయుండదే
　　కరిరాజు తావక ♦ కరుణలేమి
జూచువారలకు పి ♦ చ్చుకరీతి దోపదే
　　గరుడుండు తావక ♦ కరుణలేమి

తే. గానదీనుడనగు నన్ను ♦ కరుణజూడు
　　మనుచు వేడెదనిన్ను నే ♦ ననవరతము ॥భూ॥ 66

సీ. మోదంబుతో దేవ ♦ కీ దేవి వసుదేవు
　　లాత్మజుడను నట్టి ♦ హర్షమునను
వచ్చు కష్టములెల్ల ♦ వారింపగల ముఖ్య
　　బంధు వటంచెంచి ♦ పాండవులును
మము ప్రేమ మన్నింపు ♦ మూమనోహర యంచు
　　కడు గోర్కెచే గోప ♦ కామినులును
సంగరోర్విఁ బెనంగి ♦ సమయింతు మనుచు రో
　　షముచేత కంసాది ♦ శత్రువులును

తే. సంతతమునిన్ను కృష్ణ కృ ♦ ష్ణా యటంచు
　　దలచుటయెగాదె వారెల్ల ♦ ధన్యులౌట ॥భూ॥
　　భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
　　గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 67

సీ. జనకుండు కడిగె భూ ♦ జాత పెండిలివేళ
నీరజాభం బైన ♦. నీపదంబు
దానమిచ్చి వహించె ♦ తన శిరమున బలి
నీరజాభం బైన ♦ నీ పదంబు
గర్వించి తలదాల్చె ♦ కాళీయ భుజగుండు
నీరజాభం బైన ♦ నీపదంబు
బండరూపము నుండి ♦ పైధంచె యహాల్య
నీరజాభం బైన ♦ నీ పదంబు

తే. అట్టినీపద ద్వంద్వంబు ♦ ననుదినంబు
చిత్తముననిల్పి పూజింతు ♦ శ్రీనివాస భూ॥

సీ కనులకింపగునట్టి ♦ కాంతల సురతంబు
మరగియే ప్రొద్దు ద్రి ♦ మ్మరుమనంబు
సంసారమేరీతి ♦ జరుగునాయని మహా
చింతనంబెపుడు జే ♦ సెడుమనంబు
యితరుల వంచించి ♦ మొనలేనిధనము సం
పాదింప నెంచు పా ♦ పపు మనంబు
ధాన్యధనసమృద్ధి ♦ దనరుచుండినయట్టి
పరులసంపదకు నో ♦ ర్వనిమనంబు

తే. నిర్మలంబుగ నీపాద ♦ నీరజముల
యందునిల్చిన మోక్షంబు ♦ జెందుటరుదె ॥భూ॥
భూరిదయసీమ ♦ శ్రీమదనారిధామ
గారిసుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 69

సీ. శృంగార పోవృలై ♦ చిత్రచిత్తరువుల
సంచయంబులుగల్గు ♦ సౌధములను
యెన్నడైనను మాట ♦ కెదురాడి యెరుగని
ప్రవిమలమతియైన ♦ ప్రాణసతియు
చక్కదనంబునఁ ♦ శంబరారాతిని
బోలియున్నట్టి స ♦ త్పుత్రవరులు
ఘనతరంబైమనం ♦ బున మితిలేనట్టి
సంతోషమొదవించు ♦ సంపదయును

తే. శాశ్వతంబని నీపాద ♦ సరసిజముల
సేవజేయక మూఢులై ♦ చెడుదురిలను ॥భూ॥ 70

సీ. పండితులగు వారు ♦ బహు నమ్రులై యుంద్రు
ఫల కాలమున వృక్ష ♦ ముల విధమున
ఆడంబరపు మాట ♦ లాడరు సజ్జను
లపరంజి మ్రోతలే ♦ కడగి నట్లు
దానమిచ్చెడు వారు ♦ తగచాటు కొనబోరు
నిండు కుంభము తొనక ♦ కుండు నట్లు
ధనమున్నదని చెప్ప ♦ కొనబోడు ధనికుండు
సద్గంధ కుసుమంబు ♦ సరణి ధరణి

తే. తెలియ బడరిల నీకు భ ♦ క్తులు నెవరికి
నిపురు నెఱిగప్పి యున్నట్టి ♦ నిప్పు పోల్కి
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 71

సీ. జనన మొందిన దాది ♦ ఘన పాప కృత్యముల్
తెల్సి తెలియక యెన్ని ♦ సలిపి నానో
పెద్ద లయెడను న ♦ ప్రియమైన వాక్యముల్
బలిమిమై నేనెన్ని ♦ బల్కి నానో
నీభక్తులను గాంచి ♦ నెఱి బరిహాసముల్
చెనటి మానసుడనై ♦ జేసి నానో
పరధనంబుల కాస ♦ పడి యెన్ని మారులు
తస్కరింపగ నెదఁ ♦ దలచి నానో

తే. అట్టి కల్మష తతుల బో ♦ గొట్టు నట్టి
జెట్టి వీవని నీసేవ జేయుచుంటి ॥భూ॥ 72

సీ. కాల ధర్మము జెందు ♦ కాల మేతేరగా
వివశత విబుధేంద్ర ♦ వినుత శౌరి
పన్నగాధిప శాయి ♦ పన్నగారి వాహనాయి
పద్మ సంభవస్తోత్ర ♦ పద్మ నేత్ర
సింహ విక్రమ నార ♦ సింహ పరాత్పరా
జలధి బంధన చక్రి ♦ జలజనాభ
జనకజాధిప కామ ♦ జనక మోహన రూప
రంగ కారుణ్యాంత ♦ రంగ యనుచు

తే. నీదునామంబు స్మరియింప ♦ నేరగాన
దలతు నిప్పుడె దయజూడు ♦ ధర్మచరిత
భూరిదయసీమ ♦ శ్రీమడనూధిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 73

సీ. ఘన భక్తి నుపకార ♦ మును జేసి మెప్పింప
తర్కింప భాను నం ♦ దనుడగాను
పాషాణముల్ గర్గ ♦ బాడి సీ హృదయంబు
రంజింప జేయ నా ♦ రదుడ గాను
పసి తనంబున నుండి ♦ పట్టువదలక నిన్ను
భజియింప దైత్య డిం ♦ భకుని గాను
విమల మానసమునన్ ♦ విందొనరించి సం
తోషింపజేయ వి ♦ దురుడ గాను

తే. జడుడ దీనుడనైన నా ♦ శక్తికొలది
నిన్ను స్మరియింతు గావుమా ♦ కన్నతండ్రి ॥భూ॥ 74

సీ. భక్తవత్సల కోటి ♦ భాస్కర సమతేజ
శంకరార్చిత పాద ♦ శరణు శరణు
పద్మాలయాధిపా ♦ పన్నివారణ దేవ
శత్రువిభంజనా ♦ శరణు శరణు
నరకేసరాకార ♦ ద్విరదాధి పావనా
చంద్రదినే శాక్ష ♦ శరణు శరణు
పాషాణ రూపమై ♦ బడియున్న మౌనీంద్రు
సతిశాప మోచనా ♦ శరణు శరణు

తే. యనుచు నత్యంతభక్తిని ♦ న్నభినుతించు
నన్ను దయనేలుమానళి ♦ నదళనేత్ర
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గారినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 75

సీ. వాయసకర భృత ♦ వర్ణమొక్కటి యయ్యు
పల్కులందున భేద ♦ పడిన రీతి
బకహంసలకును రూ ♦ పం బేకమయ్యు క్షీ
రాంబు భేదముల వే ♦ రైన భాతి
కర్పూర లవణముల్ ♦ గననొండు విధమయ్యు
మానుగరుచుల వే ♦ రైన కరణి
నశ్వ గార్ధభములే ♦ కాకృతి గనుపించి
యారయనడక వే ♦ రైన గతిని

తే. భువిని పెంపొందుచున్న మా ♦ నవుల యందు
పరమభక్తులు కొందరై ♦ బరగుచుంద్రు ॥భూ॥ 76

సీ. పలువిధదుంపలన్ ♦ భక్షించు భూదార
మలవియే క్షీరాన్న ♦ మనుభవింప
నిరతంబు పుండ్ల దు ♦ ర్నిరుద్రావెడుయీగ
కలవియే పూదే నె ♦ ననుభవింప
మీనశాబకములన్ ♦ మేయుచుండెడు కొంగ
కలవియే రత్నంబు ♦ లనుభవింప
కర్కటసంతతిన్ ♦ గబళించగలనక్క
కలవియే కరిమాంస ♦ మనుభవింప

తే. ఘోరకలుషంబు లొనరించు ♦ కుజనునకును
తరమె సుధతుల్య నీనామ ♦ స్మరణ సేయ
భూరిదయసీమ ♦ శ్రీమడసూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 77

సీ. ధార్మికగుణముచే ♦ ధనికుండు పొగడొందు
పతిభక్తిచేజెందు ♦ పడతికీర్తి
గుణగరిష్టునిచేత ♦ కులమొందు ప్రఖ్యాతి
నభము సూర్యునిచేత ♦ ప్రథదనర్చు
క్రీడబాలురచేత ♦ గృహము చెన్నలరారు
ధరణీశ్వరునిచేత ♦ ధాత్రిప్రోల్చు
వనప్రియంబులచేత ♦ వనమువాసివహించు
రాత్రిసుధాంశుచే ♦ రమణమెరయు

తే. నట్లనీదివ్య నామంబు ♦ ననుదినంబు
పఠనచే ముక్తిసులభమై ♦ ప్రణుతికెక్కు ॥భూ॥ 78

సీ. జనన మరణ దుఃఖ ♦ సాగరంబును దాట
నావయై బరగు నీ ♦ నామ స్మరణ
యజ్ఞాన తిమిరంబు ♦ నడగింప రవి సమా
నంబయి బరగు నీ ♦ నామస్మరణ
పాపాటవిని దహిం ♦ పగ జేయగల దవా
నలమై బరగును నీ ♦ నామస్మరణ
తలగని యీషణ ♦ త్రయ కరి పంచాన
నంబయి బరగునీ ♦ నామస్మరణ

తే. తుచ్ఛ సుఖముల యందాశ ♦ తొలగ ద్రోచి
నవ్య పరసుఖ మొసగు నీ ♦ నామస్మరణ
భూరిదయనీను ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 79

సీ. ధర్మగుణముచేత ♦ ధనము వర్ధిలుచుండు
నారూఢి తీయునీ ♦ రూరినట్లు
విద్యపరులకు జెప్ప ♦ విమల మైతనరాదు
నోరయిక బంగారు ♦ మెరసినట్లు
గుణవంతు చెలిమి దు ♦ ర్గుణముల దొలగించు
యినుము పరుసస్పర్శ ♦ హేమ మట్లు
క్షితినెవ్వరైన ద ♦ ర్శింప సత్యము దేలు
దట్ట మౌదధి వెన్న ♦ బుట్టినట్లు
తే. భక్తి నీనామ మంత్రంబు ♦ బఠన సేయ
పరమపద ప్రాప్తి సులువుగా ♦ బడయగల్గు ॥భూ॥ 80

సీ. కమనీయ మైనట్టి ♦ గండు చక్కెర కన్న
బహురుచియగు చూత ♦ ఫలము కన్న
కదళి నారికేళ ♦ ఖర్జూర పనసాది
పలువిధ మధురంపు ♦ పండ్ల కన్న
నెటి తీయదనమైన ♦ చెఱుకు రసము కన్న
మానితంబగు జుంటి ♦ తేనె కన్న
భక్షింప యోగ్యమౌ ♦ పాయసాన్నము కన్న
దధిక్షీర సద్యో ఘృ ♦ తంబు కన్న
తే. మధురమై యొప్పు నీనామ ♦ మంత్ర మెపుడు
స్మరణ జేసిన పురుషుండు ♦ పరము గాంచు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గారెనుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 81

సీ. రసవిహీనునకును శా ♦ స్త్రమును బోధించుట
నురు చెవిటి చెంత శం ♦ ఖూది నట్లు
నతిలోభి వానిని ♦ యాచింప నెంచుట
వనిత నపుంసకు ♦ వలసి నట్లు
శత్రునియింట భో ♦ జన మొనరించుట
బెబ్బులి నోట జేయి ♦ బెట్టి నట్లు
కుత్సితునతో మైత్రి ♦ గూడి చరించుట
పామున్నయింట తా ♦ బండి నట్లు
తే. చెలగి నీభక్తులను నింద ♦ జేయు చుంట
సరగ సద్బ్రాహ్మణ హత్య ♦ సల్పి నట్లు ॥భూ॥ 82

సీ. వేపచెట్టుకు తేనె ♦ వేమారు బోసి పెం
చిన యెన్నినాళ్ళకు ♦ చేదు బోదు
సురలోన పన్నీరు ♦ సుస్థిరంబుగ బోసి
కలిపిచూచిన దాని ♦ కంపు బోదు
పొంకంబుగా పాలు ♦ బోసిపెంచిన పాము
వీసమైనను దాని ♦ విషము విడదు
యంధలో చనమున ♦ కంజనంబును బెట్ట
సురుచిరంబైనట్టి ♦ చూడ్కి రాదు
తే. అట్లె మూఢాత్మునకు శ్రేయ ♦ మైన జ్ఞాన
మార్గమునుదెల్ప తనపూర్వ ♦ మతము విడదు
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరిసుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ, 83

సీ. తస్కరులను ఘోర ♦ తర మృగంబుల బాధ
కలుగుగదా యంచు ♦ కలఁతతోడ
కష్టంబులను నట్టి ♦ కరకురాల్ దగిలి ని
స్సీయుబియను మనో ♦ చింత తోడ
బ్రతుకు మార్గంబను ♦ బాటగానక తొట్రు
పడి మనంబున దిగు ♦ ల్పడుచు నెపుడు
సతిసుతులను నట్టి ♦ యతిభయంకర నురుల్
దవిలి వెల్వడను సా ♦ ధ్యంబు గాక

తే. కడదెలియరాని సంసార ♦ గహన మందు
జిక్కితిని నుద్ధరింపుమో ♦ శ్రీనివాస ॥భూ॥ 84

సీ. తుమ్మవృక్షమునకు ♦ దోడనేజన్మించు
కంటకంబులు మధ్య ♦ కలుగబోవు
విత్తనంబుననుండి ♦ వేపచెట్టుకుచేదు
కలిగియుండును మధ్య ♦ కలుగబోదు
తొలుదొల్తనే తేలు ♦ తోకయందువిషంబు
కలిగియుండును మధ్య ♦ కలుగబోదు
పామునోటవిషంబు ♦ ప్రభవించినప్పుడే
కలిగియుండును మధ్య ♦ కలుగబోదు

తే. నల్లపెద్దలదూరు దు ♦ రాత్మునకును
కలుగు జననంబునందె మూ ♦ ర్ఖంబుభువిని
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గారినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 85

సీ. విత్తంబుకై సుంత ♦ వెతలేదనుచులోన
తనివి జెందించెడు ♦ ధనమదంబు
పదివిద్యలందు నే ♦ ర్పరితనంబమరెనా
కేమనిపించు వి ♦ ద్యామద బు
ముద్దియలకు మోహ ♦ మును బెరిగించు లో
పలయనిపించు రూ ♦ పపుమదంబు
వైరుల క్షణములో ♦ పలగెల్తునను ధృతి
గలుగజేయుచునుండు ♦ బలమదంబు

తే. లకునులోనయికడు నిర్మ ♦ లంపునీదు
స్మరణచే జన్మతరియింప ♦ జాలరిలను ॥భూ॥ 86

సీ. పాము నైనను నెత్తి ♦ పై పూల మాలగా
దాల్చిన నొకవేళ ♦ దాల్పవచ్చు
పూని రాక్షసులతో ♦ బోరి సద్విజయంబు
బొందిన నొకవేళ ♦ బొందవచ్చు
గంభీరమై భయం ♦ కరమైన జలనిధిఁ
గట్టిన నొకవేళ ♦ గట్టవచ్చు
దారుణంబైనట్టి ♦ దావ కృశానునిఁ
మ్రింగిన నొకలేళ ♦ మ్రింగవచ్చు

తే. గాని ధరలోన మూర్ఖు సు ♦ జ్ఞాన కలితు
జేయ తరమానె యా సుర ♦ జ్యేష్ఠుకైన ॥భూ॥
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 8

సీ. గజరాజ వరద నీ ♦ భజన సల్పెడువాని
పరిహసించుచు నుండు ♦ వాడు మాల
నాకంటె యధికుడీ ♦ లోకమందున నున్న
వాడె యటంచెంచు ♦ వాడు మాల
యితర జనోన్నత్య ♦ మెద సహింపక దూల
నాడుచు గర్వించు ♦ వాడు మాల
ధర్మంబెరింగియుఁ ♦ ధన కాంక్షచే పక్ష
పాత వాదము సేయు ♦ వాడు మాల

తే. మాలవాడని జాతి చం ♦ డాలు నెంచ
నేల వీరెల్ల నుండ గో ♦ పాలబాల ।భూ॥ 88

సీ. అతిభాసురంబయి ♦ యలరారు శంఖ చ
క్ర ద్వయంబుకరయు ♦ గమున చెలగ
దిశలవ్యాపించు దీ ♦ ధితుల కౌస్తుభ మణి
భువనమోతయు యుఱం ♦ బునను మెరయ
నీలమేఘము కాంతి ♦ నిర్జింప జాలిన
సుందరంబగు మేను ♦ సొబగు మిగుల
కమనీయమై శ్రమ ♦ కరమై కటిప్రదే
శంబున పీతాంబ ♦ రంబు వెలుగ

తే. వచ్చి కడుప్రేమ దర్శనం ♦ బిచ్చి భక్త
తతిని నేలుదు వటమొందు ♦ దాగితిపుడు
భూరిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 89

సీ. జందెంబు మెడనున్న ♦ జగతీసురుండౌనె
  తిరమైన బ్రహ్మంబు ♦ దెలియ కున్న
కరతాళములు గొట్ట ♦ గా భక్తిపరుడౌనె
  చిత్తంబు నీయందు ♦ జేర్ప కున్న
నవధూతయని బిల్వ ♦ నర్హుడౌనే భావ
  మందు సర్వాపేక్ష ♦ లడగ కున్న
యోగీశ్వరుండన ♦ యొప్పునే సర్వభూ
  తములనేక విధంబు ♦ దలపకున్న

తే. పరమపద ప్రాప్తిదొరకు నే ♦ భక్తితోడ
  నిరతమునునిన్ను స్మరియింప ♦ నేర కున్న ॥భూ॥ 90

సీ. బ్రహ్మవేత్తల మంచు ♦ బహు వేషములు వేసి
  దేశ దేశంబులు ♦ దిరుగుచున్న
మీసలు గడ్డంబు ♦ మితిమీరగా బెంచి
  కాషాయ చేలముల్ ♦ గట్టుకొన్న
నాలుబిడ్డల వీడి ♦ యడవికి జని జెడల్
  బెంచి స్వేచ్ఛను విహ ♦ రించుచున్న
కలకాలమెల్ల యే ♦ కాదశ వ్రతములు
  కడు నిష్టబూని తా ♦ గడుపుచున్న

తే. నీవు గురురూపమున వచ్చి ♦ నిలచి తత్వ
  బోధ సేయక మోక్షంబు ♦ పొసగుటెట్లు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
  గౌరిసుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 91

సీ. భక్తుడా యీతండు ♦ పండితుడా యంచు
పరిహాస వచనముల్ ♦ బలుకుచున్న
కారణం బేమి లే ♦ కయె పామరచయంబు
మించు గర్వమున దూ ♦ షించుచున్న
నింది తంబైనట్టి ♦ నేరమొక్కటి మోపి
వడిబైనబడి కొట్ట ♦ వచ్చుచున్న
సత్యాత్ముడా సదా ♦ చార పరుండవు
బుద్ధి వంతుడవంచు ♦ బొగడుచున్న
తే. సందియము రోషమును భీతి ♦ సంతసంబు
లేక మెలగు దుత్తముల్ ♦ లోకమునకు ॥భూ॥ 92

సీ. వనరుగానది లోన ♦ మునిగియొడ్డున జేరి
తిన్నగా జపమాల ♦ ద్రిప్పవచ్చు
కాయమెల్లను చక్క ♦ గా పూర్ధ్వపుండ్రముల్
దిద్దిభక్తునిరీతి ♦ దిరుగవచ్చు
పుడమిలోపలగల్గు ♦ పుణ్యక్షేత్రము లెల్ల
విసువుజెందకయె సే ♦ వింపవచ్చు
తతశాస్త్రవేది చెం ♦ తకు జేరిజదివి తా
పండితనామంబు ♦ బడయవచ్చు

తే. గాని మానసమటుయిటు ♦ గదలనీక
నీపదాబ్జంబులందు ♦ న నిల్పుటరుదు ॥భూ॥
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 93

సీ. పూనిరజోగుణం ♦ బున ప్రజాపతిపేర
సకల జగముల సృష్టి ♦ సల్పుదీవు
సత్వగుణంబుచే ♦ సర్వప్రాణులను వి
ష్ణువుపేర పోషించు ♦ చుందు వీవు
తతతమోగుణము చే ♦ తను శంకరునిపేర
జీవకోటిల యంబుః ♦ జేతు వీవు
అఖిల ప్రపంచంబు ♦ నంటి యంటక నిష్క
ళంకనాముడవై య ♦ లరుదువీవు
తే. గాన నీమహ త్తత్వంబు ♦ గనుగొనంగ
నుర్వి నెవ్వరి సాధ్యంబు ♦ నిర్వికార ॥భూ॥ 94

సీ. తీర్థ యాత్రల నెల్ల ♦ దిరిగిన మోక్షంబు
లభియించు నను మాట ♦ లను విడచియు
వుపవాస వ్రతముల ♦ నొనర సల్పిన ముక్తి
దొరకు ననెడి మాట ♦ ద్రోసివేసి
స్నాన సంధ్యాదును ♦ జరిపిన కైవల్య
మబ్బు ననుట దబ్బ ♦ రనుచు దెలిసి
చక్రాంకితములైన ♦ శౌరి సాన్నిధ్యంబు
యను మాట మనమునం ♦ దణచివైచి
తే. తన్నె రింగిన గురుని పా ♦ దముల సేవ
జేసి తను దానెరింగిన ♦ జెందు పరము
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 95

సీ. పెద్దల గని మహా ♦ ప్రియముతో మ్రొక్కుట
నను దినంబును సత్య ♦ మాడుటయును
సర్వ ప్రాణుల యందు ♦ సమ భావ మూనుట
గురునాజ్ఞ మీరక ♦ బరగు టయును
పరుల నెన్నడు బాధ ♦ పడ జేయకుండుట
బీదల యెడ మిక్కి ♦ లాదరణయు
పరధనంబుల పయి ♦ భ్రాంతి లేకుండుట
మది హంస మంత్రంబు ♦ మరువకుంట

తే. ధరణి యివియన్ని మోక్ష సా ♦ ధనములంచు
నాచ రింతురు సద్గుణు ♦ లన వరతము ॥భూ॥ 96

సీ॥ ఆరయనాదినోం ♦ కారంబు నందున
నాకాశ ముత్పన్న ♦ మయ్యె వెనుక
గగ నంబునను సదా ♦ గతి జనించెను నట్టి
యని లంబు నందున ♦ నగ్నిబుట్టె
జాత వేదుని యందు ♦ జలము సంభవమయ్యె
సలిలంబు నందునన్ ♦ గలిగెపృథ్వి
యీ పంచ భూతము ♦ లెనసిన సర్వ ప్ర
పంచ మాయె నటంచు ♦ నెంచిసతము

తే. నిన్నిటికి కారణుండవయి ♦ యున్న నిన్ను
నమ్మి ధ్యానించుచుండెడు ♦ నరుడె నరుడు
భూరిదయసీమ ♦ శ్రీమడనూరిధామ
గారినుతనామ శ్రీరామ ♦ ఖలవిరామ. 97

సీ. పద్మాసనస్థుడై ♦ ప్రణవాది నాదముల్
వినుచు ధైర్యముతోడ ♦ విమలు డగుచు
కర్మేంద్రియంబులన్ ♦ గదలనీయక లోన
కామాది షడ్వర్గు ♦ గట్టు పరచి
భ్రూమధ్యమున దృష్టి ♦ పూర్ణంబుగా నిల్పి
దివ్యమై సురుచిరమై ♦ యవ్యయమయి
కమనీయమై క్రమ ♦ కర స్వప్రకాశమై
వెలుగొందు చున్నట్టి ♦ వెలుగు గాంచి

తే. మనసు వాయువుతోడ స ♦ మ్మతిగ జ్యోతి
యందునిల్పిన గదసిద్ధి ♦ బొంది నట్లు ॥భూ॥ 98

సీ. మనసు సుషుప్తి యం ♦ దున మగ్నతను బొంద
జగమున్నదను జ్ఞప్తి ♦ సమసిపోవు
మనసు జాగ్రతను జెం ♦ దిన ప్రపంచంబెల్ల
గల్గియుండిన రీతి ♦ గానుపించు
మనసు సంసార మం ♦ దున ప్రేమజరియింప
సర్వసుఖంబులున్ ♦ జరుగు చుండు
మనసు విరాగత్వ ♦ మునుబూని నటియింప
సుఖదుఃఖములు నెల్ల ♦ బోరిదినడగు

తే. నట్టి బంధవిముక్తుల ♦ కాలవాల
మా మనసు లేమియే గదా ♦ నార్యవృత్తి
రిదయసీమ ♦ శ్రీమదనూరిధామ
తనామ శ్రీరామ ♦ ఖలవిరామ.

సీ. పద్మశాలి కులంబు ♦ పావనుండ నగ మా
　　ర్కండేయ మౌని గో ♦ త్రంబునందు
పణితపురశంశ సం ♦ భవుడు శ్రీకొండ యా
　　ర్యుని సుతాగ్రజుడైన ♦ ఘనయశుండు
లింగయాహ్వయునకు ♦ మంగమాంబకు జన
　　నంబయి భువిలోన ♦ నాగభూష
ణాఖ్యత నీసేవ ♦ ననవరతము జేయు
　　చును భక్తయోగ్యంబు ♦ గను శతకము
తే. నీకరుణ వ్రాసినాడ దీ ♦ నిం బ్రశస్త
　　చంద్రతారార్కముగ బ్రోవ ♦ సంస్తుతింతు ॥భూ॥ 100
సీ. భువనముల్ బుట్టించి ♦ పోషించి సమయించు
　　మహనీయ సంకల్ప ♦ మంగళంబు
బ్రహ్మాది సురసేవ్య ♦ పాద సరోసక
　　మౌని మానసలోల ♦ మంగళంబు
దశకంఠ కంఠ బృం ♦ ద విభేదనాకోటి
　　మార్తాండ సమతేజ ♦ మంగళంబు
కాళీయ మదభంగ ♦ కరుణాంతరంగ శ్రీ
　　మాపనీ వ్యాచోచ్చర ♦ మంగళంబు
తే. యాది మధ్యాంతరహిత య ♦ వ్యయానంత
　　మహిత వాఙ్మనసాతీత ♦ మంగళంబు
　　భూరిదయ సీమ ♦ శ్రీమడనూరి ధామ
　　గౌరినుతనామ శ్రీరామ ♦ ఖలవి రామా 101

మడనూరి శ్రీరామ శతకము

సంపూర్ణము

వలయువారు:—

పణితపు నాగభూషణం

మడనూరు

ఈతముక్కలపోస్టు,

ఒంగోలు తాలూకా.

అని వ్రాసి తెప్పించుకొనవచ్చును.